శ్రీ వేంకటేశ్వరగ్రంథమాల:—
ప్రథమకుసుమము
సంపాదకులు:
మాటేటి వరవరరావుగారు.



ఓం

శ్రీ

# ముకుందమాలా

సంస్కృతశ్లోకములకు సరియైన
ఆంధ్రటీకా పద్య తాత్పర్యసహితము.
శైలి మృదుమధురము.

చిలుకూరు శ్రీరాములుగారిచే
ప్రకటితము.

బెజవాడ:
ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్ (లిమిటెడ్) యందు
క. కోదండరామయ్యగారిచే
ముద్రింపఁబడియె.
రక్తాక్షి సం|| కార్తికము.
1924.



[వెల ౨ అణాలు.

# సంపాదకీయ భూమిక

(౦)

ముకుందమాలా స్తోత్రశ్లోకములు హరిభక్తుల కెల్లర కన నేల, సర్వజనులకు చిరపరిచితములనిన నతిశయోక్తి కాజాలదు. సంస్కృతపరిజ్ఞానశూన్యులకును, స్త్రీలకును, బాలురకును, సుగమ మగునటుల, శ్లోకములకు ప్రతిపదార్థము తాత్పర్యమేకాక, మాతృకను మఱపింపంజాలు చక్కనిపద్యములతో శ్రీ వేంకటేశ్వర గ్రంథమాలాప్రథమపుష్పముగ బ్రచురించు భాగ్యము మాకు లభించినందుల కెంతయు సంతసిల్లవలసియున్నాము. కాని యిట్టి యుత్తమోత్తమ గ్రంథరాజముల నింక గొన్నిటినైన ప్రకటించి భాషామతల్లి కానందము చేకూర్పనిదే మాకానంద మంకురింపదు. ఈపద్యముల యాంధ్రీకరణమందలి పదలాలిత్యము, అర్థగౌరవమును మేము కొనియాడుటకన్న గుణాగుణరసగ్రహణ పారీణులగు చదువరులే గ్రహింపగలందుల కాభారము వారిపై నుంచుటయే రసవత్తరమని నాయభిప్రాయము. ఈ గ్రంథమును సక్రమపద్ధతులపై శుద్ధప్రతివ్రాసి గ్రంథోద్ధరణ మొనర్చిన మామిత్రులును ఆంధ్రయువకులగు శ్రీ వేదమూర్తులయిన బ్రహ్మశ్రీ చిలుకూరి శ్రీరాములుగారి కేనెంతయు కృతజ్ఞుఁడ. గ్రంథమునుసాధ్యమయినంతవరకు తప్పులు లేకుండ ననతికాలమున నచ్చొత్తియిచ్చిన శ్రీ ఆంధ్రగ్రంథాలయ ప్రెస్ వారు గణనీయులు. మాగ్రంథ మాలాభివృద్ధికై పాటుపడు రాజపోషకులును, పోషకులును, చందాదారులుగను నున్న నాయాంధ్రసోదరుల కెల్లర కభినందనములు.

ఇట్లు, సంపాదకుడు,

మాటేటి వరవరరావు.

# ఉపోద్ఘాతము

శ్రీవైష్ణవభక్తాగ్రేసరుండై, పన్నిద్దరాళ్వారులం బ్రసిద్ధివడసి కీర్తిగన్న శ్రీకులశేఖరరాజశేఖరుం డీముకుందమాలాస్తోత్రశ్లోకముల భక్తిపరవశత్వమున, తన్మయత్వమున రచించి భక్తాగ్రేసరుల కెందరకో తరణోపాయము చూపి జీవన్ముక్తుం డయ్యె. ఇమ్మహీపతిచరిత్రము మిగుల నాశ్చర్యాస్పదమైన దనుటకు వీరినిగురించి వాడుకొనబడుగాథలే నిదర్శనము లనరాదు. కులశేఖరమహారా జొక పండితోత్తమునివలన రామాయణము శ్రవణానందము చేసికొనుచు నాయాసందర్భముల తత్తద్రసముల గ్రహించుచు శ్రీరాములవారు కపిసేనాసమేతము లంకపై దండెత్తిపోవుతరి తనసేనాధ్యక్షునిసైతము చతురంగబల సమేతముగా దశకంఠకంఠలుంఠనార్థ మాయత్తుడై శ్రీరామసహాయమునకై నిశ్చయముగ వారధివర కరుగునప్పుడు శ్రీరామచంద్రమూర్తి ప్రత్యక్షుమై రాజా! నిసహాయము నాకు చాలును. సర్వము చేకూరినవి. నీభక్త్యతిశయమునకు మెచ్చితినని గ్రుచ్చికవుగలించిన ట్లివ్విధంబున పెక్కుగాథలు వాడుచున్నారు. ఎట్లయినను యీ కులశేఖరుం డట్టిభక్తివిభ్రముడగుట మాత్రము నిజమని యొప్పుకొనక తీరదు. అట్లె శ్రీరంగయాత్రార్థ మరుగ ప్రయాణసన్నాహము చేయు మంత్రులిరా జట కరిగినచో భక్తిపారవశ్యమున రాజ్యము మఱచిన నరాజకమానను భీతిని వైష్ణవభక్తాగ్రేసరుల భాగవతుల బ్రేరేచి యెదు రంపి వారి సంతర్పణార్థము రాజు వెనుదిరుగకున్న భాగవతాపచారభయముగొల్పి యువ్విధమున నే

యనుదిన శ్రీరంగయాత్రాకుతూహలాయత్తచిత్తునిగ వాడు కొనం జేసిరనియు వినుచుందుము. అట్టి మహనీయుని వాగమృతలహరీజనితమగు నీ ముకుందమాలాశ్లోకముల నొక విస్మృతకవి చక్కగ నాంధ్రీకరించి యస్తంగతుండయ్యె. అయ్యది డెబ్బదిపదాకండుదొసగులతో శిథిలీకృతపత్రముల పై మిణుకు మిణుకుమనుచు మాకుగోచరముకాగా దాని నెన్నో విధముల శక్త్యానుసారము పరిష్కరించి కొన్ని శ్లోకములకు పద్యములే లేనికారణమున వానిపూరించి కేవలశ్లోకముల, పద్యముల బ్రకటించుటకన్న టీకాతాత్పర్యములచే బ్రకటించిన సర్వభక్తోపయోగమగునని తలంచి యట్లు సమకూర్చి, గ్రంథరూపకమున సమకూర్చితిమి.

కేవల విద్యాభివృద్ధికై పాటుబడ కంకణము గట్టుకొన్న శ్రీ వేంకటేశ్వరగ్రంథమాలాధికారులీ నాయుద్యమమునకు వన్నెపెట్టి బ్రోత్సహించి తమ గ్రంథమాలయం దీగ్రంథమునే ప్రప్రథమకుసుమముగ బరిగణించి మమ్మాదరించి నందులకవ్వారనుక్షణస్మరణీయులు. వీరిట్లే యుత్తమగ్రంథముల తమమాలయందు జేర్చుకొని భారతీమతల్లికి తోధికాహ్లాదము చేకూర్చితద్‌జ్ఞులమన్నన వడసి యిహమందు కీర్తిని, పరమందు ముక్తిని బొందెదరు గాతయని యిందలిగుణాగుణముల క్షీరనీరవిభాగకౌశలత్వముగల రాజహంసలభాతి చదువరులే యనుభవించెదరుగాతయని యింతట గ్రంథవిస్తరభీతిని విరమించెదము.

—చిలుకూరి శ్రీరాములు.



శ్రీ

# ముకుందమాలా

—:o:—

శ్లో॥ ఘుష్యతే యస్యనగరే । రంగయాత్రా దినేదినే
త మహమ్ శిరసావందే । రాజానం కులశేఖరం॥

టీ. యస్యనగరే - ఎవ్వనిపట్టణమందు, దినేదినే - ప్రతిదినమును, రంగయాత్రా - శ్రీరంగయాత్ర, ఘుష్యతే - మ్రోయుచుండునో, తం - ఆ, రాజానం - రాజశేఖరుండగు, కులశేఖరం - కులశేఖరునికి, అహం - నేను, శిరసా - మూర్ధముచే, వందే - నమస్కరించుచున్నాను.

క. దినదిన మేనృపుపట్టణ
మున శ్రీరంగాభియాత్ర ♦ మ్రోయుచునుండుఁ
ఘను నాకులశేఖరుపద
వనజములకు శిరమువంచి ♦ వందనమిడుదుఁ॥

తా. ఏరాజశేఖరుని పురమందు ప్రతిదినమును శ్రీరంగయాత్ర మ్రోయుచుండునో అట్టి కులశేఖరునికి శిరసా నమస్కరింపుచున్నాను.

శ్లో॥ శ్రీవల్లభేతి వరదేతి దయాపరేతి
భక్తప్రియేతి భవలుంఠనకోవిదేతి
నాథేతి నాగశయనేతి జగన్నివాసే
త్యాలాపనం ప్రతిపదం కురుమే ముకుంద! ౧

టీ. ముకుంద - ఓముచికుందా! మే - నాయొక్క, ప్రతిపదం - ప్రతిశబ్దమును, శ్రీవల్లభేతి - శ్రియఃపతేయనియు, వరదేతి - భక్తవాంఛాఫలప్రదా యనియు, దయాపరేతి - ఆశ్రితావనప్రధానా యనిగాను, భక్తప్రియేతి - భక్తలోలా యనియు, భవలుంఠనకోవిదేతి - పాపోపశమనాయనియు, నాథేతి - పరిపాలకాయనియు, నాగశయనేతి - శేషశాయీయనియు, జగన్నివాసేతి - సమస్తలోకవ్యాపీ యనియు, ఆలాపనం - ఆలాపనముగా, కురు - చేయుము.

ఉ. శ్రీరమణీశ! యోవరద! ♦ శేషశయాన! జగన్నివాసకా!
దారుణపాపసంహరణ! ♦ దానవవైరి! దయాపయోనిధీ!
నీరజనాభ! యంచనెడి ♦ నిర్మలనామములో ముకుంద! నే
వారకపల్కు నామనము ♦ వర్థిలజేయుము భక్తవత్సలా!

తా. ముకుందా! సర్వకాల సర్వావస్థలయందును నన్ను నీదివ్యనామస్మరణామృతపానమత్తునిగాజేసి యానందము చేకూర్పుము తండ్రీ!

శ్లో॥ జయతు జయతు దేవో దేవకీనందనోయమ్
జయతు జయతు కృష్ణో వృష్ణివంశప్రదీపః
జయతు జయతు మేఘశ్యామలః కోమలాంగో
జయతు జయతు పృథ్వీభారనాశో ముకుందః॥ ౨

టీ. దేవః - స్వయంప్రకాశుడై, దేవకీనందనః - దేవకీసూనుడైన, అయంకృష్ణః - యీకృష్ణుడు (నామనోవిలసితుడగు నీకృష్ణుడు) జయతు,

జయతు - సర్వోత్కృష్టమును బొందుగాత! వృష్ణివంశప్రదీపః - వృష్ణివంశ ప్రకాశమానుడగు కృష్ణః జయతుజయతు, మేఘశ్యామలః - మేఘసమానమగు శ్యామలవర్ణముగల, కోమలాంగః - కోమలావయవుండగు, కృష్ణః జయతు జయతు, పృథ్వీభారనాశః - భూభారనివారకుండగు, ముకుందః - ముకుందుడగు శ్రీకృష్ణునకు జయతుజయతు.

క. జయ! దేవ! దేవకీసుత!
జయ వృష్ణికులప్రదీప! జయ శ్రీకృష్ణా!
జయ నీలకోమలాంగా!
జయ పృథ్వీభారనాశ! జయతు ముకుందా॥

తా. మేఘశ్యామల కోమలాంగుడై స్వయంప్రకాశుడై నా మానసంబున దోచుచున్న దేవకీనూనుండైన శ్రీ కృష్ణునకు జయోత్కర్షమై సర్వదా నాకు భగవత్సేవ మానసికముగా జరుగుగాత!

శ్లో. ముకుంద! మూర్ధ్నా ప్రణిపత్య యాచే
భవన్త మేకాన్త మియన్తమర్థమ్
అవిస్మృతి స్త్వచ్చరణారవిన్దే
భవేభవే మేఽస్తు భవత్ప్రసాదాత్॥

టీ. ముకుంద - శ్రీకృష్ణా, మూర్ధ్నా - మూర్ధముచేత, ప్రణిపత్య - నమస్కరించి, భవంతం - నిన్ను, ఏకాంతం - అన్యముకాక ఒక్కటేయగు, ఇయంతం - అతిస్వల్పమై యింతమాత్రమగు, అర్థం - వస్తువును, యాచే - ప్రార్థించి కోరుకొనుచున్నాను. ఆదేదనగా, మే - నా యొక్క, భవేభవే - ప్రతిజన్మమందును, త్వత్ - నీయొక్క. చరణారవిందే - పాదకమలముల యందు, అవిస్మృతిః - మరుపులేకుండుటను, త్వత్ప్రసాదాత్ - నీకృపా విశేషమువలన, అస్తు - కలుగునుగాత.

మ. హరీ! మూర్ధ్నా ప్రణిపత్య వాంఛితముచే ♦ యాచించెదన్ దేవ! నీ
చరణాబ్జంబులయం దవిస్మృతి విశే ♦ షజ్ఞానసంప త్తిచే
మరలొందన్ భవదీయసత్కరుణచే ♦ మాకుంబ్రసాదింపుమీ
శ్వర! ముమ్మాటికిమాటికిన్ సుజనవా♦త్సల్యాంబుధీ! శ్రీపతీ!

తా. ముకుందా, శిరసానమస్కరించి యొక్కస్వల్పకార్యమునకై యాచించుచున్నాను. పూర్వజన్మవాసనచే నీజన్మయం దించుక నీపాదకమలములపై తలంపు జనించినమాత్రనే రుచికల్గెను. కాబట్టి యిట్టి చరణకమలములయందలి స్మృతిని నాకు కలుగు జన్మములం దన్నిట కలుగ జేసిన నా కంతియేచాలును. ఇంతకు వేరు నాకుకావలసినదియు కోరదగినదియు యభిరుచికలదియు లేదు.

శ్లో. నాహం వందే తవచరణయోర్ద్వంద్వమద్వంద్వ హేతోః
కుమ్భీపాకం గురుమపి హరే నారకం నాపనేతుమ్
రమ్యారామామృదుతనులతా నన్దనే నాపిరంతుమ్।
భావేభావే హృదయభవనే భావయేయం భవన్తమ్॥౪

టీ. హరే - శ్రీహరీ! అహం - నేను, అద్వంద్వహేతోః - ద్వంద్వదుఃఖములు కలుగకుండునిమిత్తము, తవ - నీయొక్క, చరణయోః ద్వంద్వం - రెండు పాదములను, నవందే - నమస్కరింపలేదు, గురుం - గొప్పది, అపి - అయినను, కుంభీపాకం - కుంభీపాకమను, నారకం - నరకమును, అపనేతుమ్ - పోగొట్టునిమిత్తము, నవందే. రమ్యారామామృదుతనులతా నందనేనాపిరంతుమ్, రమ్య - సుందరములైన, ఆరామ - తోటల యందలి, మృదు - మృదువైన, తను - సన్నని, లతా - తీవలయొక్క, నందనే - పొదరింటియందు, రంతుమపి - క్రీడించుటకును, నవందే. (ఇందు రెండర్థములు కలవు) మృదు - కోమలములైన, తనులతా - తీవలవంటి శరీరముగల, రమ్యారామా - రమణీమణులగు రంభామేనకాద్యప్సరసాంగ

నలతో, నన్దనే - నన్దనవనమందు, రంతుమపి - క్రీడించుటకును నవందే. (అనగా నిహపరలోకములందలి సుఖదుఃఖముల విభ్రమణముల కారణములచే నిన్ను తలంచుటలేదనుట) భావేభావే - ప్రతిజన్మమందును, హృదయభవనే- హృదయమందు, భవంతం - నిన్ను, భావయేయం- తలంచెదనుగాత!

—♦ పంచపాది ♦—

మ. హరి! నీపాదములందు మ్రొక్కెను మదీ ♦ యద్వంద్వ
దుఃఖాళికై
ధర జన్మాంతరజన్మలబ్ధి నరక ♦ ద్వారంబులేకుండ; శ్రీ
కర! మోదంబొనరింప జేయునల శృం♦గారంపుబూదోటలన్
సురకన్యాపరిరంభణాది సుఖముల్ ♦ సొంపొప్పగాగోర్ప శ్రీ
కర! చిత్తాబ్జమునందు మాటికినిను ♦గాంక్షించి సేవించెదన్.

తా. శ్రీహరీ! ద్వంద్వదుఃఖభయముచేగాని నరకభీతిచేగాని స్వర్గభోగములకొరకుగాని నేను నిన్ను సేవించుటలేదు. నేను ముఖ్యముగా నిన్నర్థించునదేమనగా జన్మజన్మాంతరములయందును నీపయితలంపును మాత్రము నాకు కలుగజేయుము. ఎందులకనగా నీతలంపులేకున్న ద్వంద్వదుఃఖములు నశించినను నరకబాధ తప్పిపోయినను స్వర్గభోగము చేకూరినను యేమియును ప్రయోజనములేదు. ఆత్మ కుజ్జీవములేదు. ఆత్మోజ్జీవనమునకు నీపైతలంపే ముఖ్యసేవ్యము కావున నాకది యనుగ్రహించి కృతకృత్యునిచేయుము స్వామీ!

శ్లో॥ నాస్థా ధర్మే న వసునిచయే నైవ కామోపభోగే
యద్యద్భవ్యంభవతు భగవన్! పూర్వకర్మానురూపమ్
ఏతత్ప్రార్థ్యం మమబహుమతం జన్మజన్మాంతరేపి
త్వత్పాదాంభోరుహయుగగతా నిశ్చలా భక్తిరస్తు॥ ౫

టీ. ధర్మే - ధర్మమునందు, నాస్థా - ఆసక్తిలేదు, నవసునిచయే - వస్తుసముదాయమునందును ఆసక్తిలేదు, కామోపభోగే - కామానుభవమందు,

ఆస్థానైవ - అపేక్ష లేనేలేదు. భగవన్ - ఓభగవానుడా! పూర్వకర్మాను రూపమ్ - పూర్వకృతకర్మానుసారముగా, యద్యత్ - ఎయ్యది, భవ్యం - కావలసియున్నదో (అయ్యది), భవతు - అగుగాక! మమ - నాకు, బహుమతం - మిక్కిలి కాంక్షితమగు, ఏతత్ - ఇయ్యది, ప్రార్థ్యం - ప్రార్థింపదగినది: జన్మజన్మాంతరేపి - జన్మాంతరములయందును, త్వత్పాదాంభోరుహాయుగగతా - నీపాదపద్మములను బొందిన, నిశ్చల - చాంచల్యములేని, భక్తిః - భక్తి, అస్తు - కలుగునుగాత!

చం॥ ధనవనితానుభోగసుఖ ♦ తాచరణేచ్ఛయులేదొకింతయే
నను వుగనేదియైనో నది ♦ యౌగద పూర్వకృతానుసారమై
ఘనతర మస్మదీయమగు ♦ కాంక్ష భవంబులులెక్కలేకయే
చనిన భవత్పదాబ్జమధు ♦ పత్పదవృత్తిపి గల్గజేయుమా॥

తా. ఓభగవానుడా! ధర్మార్థకామములయందు నాకుబొత్తుగా కాంక్షలేదు. అవి పూర్వకృతానుసారములు కావున వాటినిగురించి కాంక్షింపపనిలేదు. కాక్షించినను ప్రయోజనములేదు. కాని నాకు ముఖ్యముగా కాక్షింపదగిన నీపదపద్మములందుగల భక్తిని జన్మజన్మాంతరములయందును దయచేయుము స్వామీ!

శ్లో॥ దివివా భువివా మమాస్తు వాసో
నరకేవా నరకాన్తక! ప్రకామమ్
అవధీరిత శారదారవిందౌ
చరణౌ తే మరణేపి చింతయామి. ౬

టీ. నరకాంతక - నరకాసుర సంహారా! మమ - నాకు, దివివా - స్వర్గమైనను, భువివా - భూమియైనను, నరకేవా - నరకమైనను, వాసః - నివాసము, ప్రకామం - పూర్ణముగా, అస్తు - అగుగాక! అవధీరిత శారదారవిందౌ - శరత్కాలపద్మసమానములగు, తేచరణౌ - నీచరణములను, మరణేపి - మరణమాసన్నమయినను, చింతయామి - తలచుచున్నాను, తలంచెదను.

ఉ. భౌమనిశాటభంజన! శు ♦ భంబగు మన్మహనీయ జన్మమీ
భూమిని, యామ్యమున్, దివిని ♦ పొందినపొందగనిమ్ము శారదా
బ్జామలయుష్మదీయచర ♦ ణాంబుజముల్ తుదినైనభక్తితో
నామదిలోననిల్పి సుజ ♦ నప్రియ! నిన్నుదలంతు మాధవా!

తా. నరకాంతకా! స్వామీ! నేనెచ్చట జన్మించినను నీపదభక్తిని మాత్రము నాకు దయచేసినచాలును. అదియున్నచో నిక నేవియు నేమియు చేయజాలవు. మరణకాలమునను నిన్ను ధ్యానింతును. అంతకన్న వేరు ఆనందమేమి కలదు?

శ్లో॥ కృష్ణ! త్వదీయపదపంకజపంజరాంత
మద్యైవ మే విశతు మానసరాజహంసః
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే? ౭

టీ. శ్రీకృష్ణా! మే - నాయొక్క, మానసరాజహంసః - మనస్సనెడు రాజహంసము. అద్యైవ - ఇప్పుడె, త్వదీయ - నీయొక్క, పదపంకజ - పాదపద్మములను, పంజరాంతం - పంజరములోనికి, విశతు - ప్రవేశించు గావుత! ప్రాణప్రయాణసమయే - ప్రాణముపోవుతఱి, కఫవాతపిత్తైః - కఫవాతపిత్తముల చేత, కంఠావరోధనవిధౌ - కంఠమవరోధింపబడు సమయమున, తే - నీయొక్క, స్మరణం - స్మరణము, కుతస్తే - ఎక్కడిది? - కలుగనేరదు.

ఉ॥ శ్రీనిధి! యుష్మదంఘ్రిసర ♦ సీరుహపంజరమందు మన్మనో
మానితరాజహంస మన ♦ మానముగా నిపుడుండుగాత! ప్రా

ణానిలమేగ కంఠగత ♦ నాళముపైకి కఫాదులెక్క సు
జ్ఞానముగల్గి నీచరణ ♦ సంస్మరణం బొనగూడనేర్చునే॥

తా. కృష్ణా! నా మనస్సు నిప్పటినుండియు నీపాదపద్మములయందు నుండునట్లు చేయుము. ప్రాణాంతసమయమందైనను నీస్మరణ కల్గినచాలును. కాని అప్పటిపరిస్థితు లతిక్లిష్టములని విందును కావున నేటినుండియే నీ స్మరణము నాకు కలుగుగాత!

శ్లో॥ చింతయామి హరిమేవ సంతతమ్
మందమందహసితాననామ్బుజమ్
నందగోపతనయం పరాత్పరమ్
నారదాదిమునిబృందవందితమ్॥ ౭

టీ. పరాత్పరం - పరమునకు పరముడైనవాడును, నారదాదిమునిబృందవందితం - నారదాదిమునిబృందములచే నమస్కరింపబడువాడును, నందగోపతనయం - నందనందనుడైనవాడును, మందమందహసితాననాంబుజం - మందస్మితవదనారవిందుండును అగు, హరిమేవ - శ్రీకృష్ణునే, సంతతం - ఎప్పుడును, చింతయామి - స్మరించుచున్నాను.

క॥ శ్రీనందగోపతనయుని
యానందుని మందమంద ♦ హాస ముఖాబ్జున్
శ్రీనారదముని సేవితు
ధ్యానించెద హరిని పరము ♦ నాద్యు ననంతున్॥

తా. నారదాది మునిబృందవందితుఁడై మందస్మితవదనారవిందుఁడై నందకిశోరమూర్తియగు శ్రీకృష్ణమూర్తి నామానసమందు ప్రకాశించుచు నానందింపుచున్నాడు. అతనిని సర్వదా స్మరించుచున్నాను.

శ్లో. కరచరణసరోజే కాంతిమన్నేత్రమీనే
శ్రమముషి భుజవీచివ్యాకులేఽగాధమార్గే

హరిసరసి విగాహ్యాపీయ తేజోజలౌఘం
భవమరు పరిఖిన్నః ఖేదమద్య త్యజామి॥ ౯

టీ. కరచరణసరోజే - హస్తములు పాదములు అను తామరతో కూడినదిన్ని, కాంతిమన్నేత్రమీనే - కాంతిగల నేత్రములను చేపల గలదియు, శ్రమముషి - శ్రమమును నివారించునదియు, భుజవీచివ్యాకులే - భుజతరంగములచే తొట్రుపడునదియు, అగాధమార్గే - మిగులలోతైనదియగు, హరిసరసి - శ్రీహరియనుకొలకునందు, విగాహ్య - మునింగి, దివ్యతేజోజలౌఘం, దివ్యతేజోదకమును, ఆపీయ - సంతృప్తిగాగ్రోలి. భవమరుపరిఖిన్నః - సంసారమరుభూమియం దనుభవించిన, ఖేదం - దుఃఖమును లేక బడలికను - అద్య - ఇప్పుడు, త్యజామి - విడుచుచున్నాను.

సీ॥ పదపాణి పద్మసం ♦ పదగల్గు; కాంతిమ
దక్షిమీనంబుల ♦ నతిశయిల్లు;
భుజతుంగవీచుల ♦ పొలుపారు; శ్రీహరి
కమలాకరంబు లో ♦ గడకువచ్చి
తద్దివ్యభవ్య సొం ♦ దర్య తేజోరాశి
జలములగ్రోలి సం ♦ సారమనెడి
యడవిలో దుర్వ్యప ♦ యావనీజంబుల
జ్ఞానతరనికుంజ ♦ సమితిదూరి,
గీ॥ మధుధరామండలంబుల ♦ దిరిగినట్టి
దుఃఖమంతయు నిప్పుడు ♦ ద్రోసిపుచ్చి
పాదకైంకర్య సామ్రాజ్య ♦ పదవినొంది
తేలియుండుదు నానంద ♦ నీరనిధిని॥

తా. సంసారాటవిం గ్రుమ్మరి యనుభవించిన ఖేదమును బడలికను శ్రీహరికమలాకరంబున మజ్జనముగావించి తత్తీర్థంబుల గ్రోలి ఉపశమింప జేసికొనుచున్నాను.

శ్లో॥ సరసిజనయనే సశంఖచక్రే
మురభిది మా విరమ స్వ చిత్త! రన్తుమ్
సుఖతర మపరం నజాతు జానే
హరిచరణస్మరణామృతేన తుల్యమ్. ౧౦

టీ. చిత్త - మానసమా! సరసిజనయనే - పద్మాక్షుడును, సశంఖచక్రే - శంఖచక్రధరుండును నగు, మురభిది - శ్రీకృష్ణునియందు, రంతుం - క్రీడించుటను, మావిరమస్వ - విరమింపవద్దు, హరిచరణస్మరణామృతేన - శ్రీహరిచరణస్మరణామృతముతో, తుల్యం - సమానమైన, అపరంసుఖతరం - యింకొక సుఖతరమగుదానిని, జాతు - ఎప్పటికిని, నజానే - ఎఱుంగను.

మ. మురసంహారుని శంఖచక్రభుజు నంభోజాక్షు శ్రీవక్షు భా
సురకల్యాణగుణామృతంబుచవిగొం చుఁ జిత్తమా! క్రీడసా
దరమొప్పన్ విడఁబోకు శ్రీహరిపదధ్యానామృతాస్వాదశ్రీ
కరసౌఖ్యంబుకు తుల్యసంపదలెఱుం గంబో మికేనాటికిన్.

తా. శ్రీహరి చరణస్మరణామృతమునకు తుల్యమగు పదార్థమింకేది యులేదు గాన శ్రీహరిధ్యానమును వదలక మనసా! ఎల్లప్పుడును చేయుచుండుము.

శ్లో. మాభీ ర్మందమనో! విచింత్య బహుధా
యామీశ్చిరం యాతనా
నామీ నః ప్రభవన్తి పాపరిపవ
స్స్వామీ నను శ్రీధరః
ఆలస్యంవ్యపనీయ భక్తిసులభమ్
ధ్యాయస్వ నారాయణమ్
లోకస్యవ్యసనాపనోదనకరో
దాసస్య కిం న క్షమః?

టీ. మందమనః - మందబుద్ధీ! యామీః - యమసంబంధములగు యాతనాః - బాధలను, చిరం - చాలసేపు, బహుధా - అనేకవిధములుగా. విచింత్య - తలంచి, మాభీః - భీతి నందకుము, అమీ - యీ, పాపరిపవః - పాపమను శత్రువులు, నః - మనకు, నప్రభవంతి - కష్టపెట్టవు, కష్టపెట్ట జాలవు. శ్రీధరః - శ్రీధరుడు, స్వామీ నను - మనకు స్వామికదా! ఆలస్యం - ఆలస్యమును, వ్యపనీయ - పోగొట్టి, భక్తిసులభం - భక్తిచేసులభముగా బొందతగిన, నారాయణం - నారాయణమూర్తిని, ధ్యాయస్వ - ధ్యానించుము, లోకస్య - లోకములయొక్క, వ్యసనాపనోదనకరః - వ్యసనములబాపుటయే ప్రధానముగాగల (భగవానుడు), దాసస్య - భృత్యుని నక్షమఃకిం - రక్షింపడాయేమి ?

సీ॥ ఏనివాసములౌనో ♦ మానవాద్యాసుర
తనువుల జనుదునో ♦ యని యనేక
విధములచింతించి ♦ వెఱవకు మందస్వ
భావమా! యీపాప ♦ బహుళరిపులు
యలయించ నసమర్థ ♦ ములు ఆలసించక
భక్తిసులభునిపాద ♦ పద్మయుగము
సేవింపుమతడు ల ♦ క్ష్మీభర్త గుణనిధి
ధ్యేయుండు స్వామి నా ♦ రాయణుండు
గీ॥ సకలజనలోకదుఃఖముల్ ♦ సమయజేసి
యిష్టసంపదలిచ్చు నా ♦ త్మేశ్వరుండు
గాడె? యత్తయుడా కృపా ♦ కలితమూర్తి
భక్తజనముల వ్యసనముల్ ♦ బాపడొక్కొ?

తా. మనసా! పాపభయము నీవెంతమాత్రము పెట్టుకొనకుము. ఆలస్యముచేయక వెంటనే భక్తిసులభుడగు శ్రీకృష్ణుని ధ్యానింపుము. సర్వలోకముల నత్యంతలీలల నేలు నాతనికొక్క దాసుని రక్షించుట భారమగునా!

శ్లో॥ భవజలధిగతానాం ద్వంద్వవాతాహతానామ్
సుతదుహితృకళత్రత్రాణ భారార్దితానామ్
విషమవిషయతోయే మజ్జతా మప్లవానామ్
భవతు శరణమేకో విష్ణుపోతో నరాణామ్॥ ౧౨

టీ. భవజలధిగతానాం - సంసారసముద్రమునకు చెందిన, ద్వంద్వవాతాహతానామ్ - ద్వంద్వదుఃఖము లను గాడ్పులచేకొట్టబడిన, సుతదుహితృకళత్రత్రాణభారార్దితానామ్ - పుత్రపుత్రీసతీ రక్షణభారములచే పీడింపబడుచున్నట్టియు, విషమవిషయతోయే - విషమభోగము లను నీటియందు, మజ్జతాం - మునిగిపోవుచు, అప్లవానాం - తెప్పలేని (అనగా దరిదోవలేని) నరాణాం - మనుష్యులకు, ఏకః విష్ణుపోతః - ఒక్క శ్రీమన్నారాయణమూర్తియనునావయే, శరణంభవతు - శరణమగుగాత!

మ॥ ఘనసంసారపయోధిజొచ్చి సుఖదుః ♦ ఖవాత్రవాతంబుచే
తను శోషించి కళత్రపుత్రసుహిత ♦ త్రాణార్దులై దుష్టభో
గనికాయాంబువులందునప్లవనదుః ♦ఖాక్రాంతులైయున్న చే
తనబృందంబుకు రక్షకంబుహరిపా ♦ దద్వంద్వనౌకంబెకా?

తా. సంసారసముద్రమున దరి తోవ లేనివారికి శ్రీమన్నారాయణమూర్తియొక్క పాదపద్మములే నావలుకదా!

శ్లో॥ భవజలధి మగాధం దుస్తరం నిస్తరేయం
కథ మహమితి చేతో మాస్మగాః కాతరత్వమ్;
సరసిజదృశిదేవే తావకీ భక్తిరేకా
నరకభిది నిషణ్ణా తారయిష్య త్యవశ్యమ్॥ ౧౩

టీ. చేతః - మనసా! అగాధం - అగాధమైన, దుస్తరం - తరింపరానిని, భవజలధిం - సంసారసముద్రమును, అహం - నేను, కథం - ఎట్లు,

నిస్తరేయం - దాటుదును? ఇతి - ఇట్లని, కాతరత్వం మాస్మగాః - ఎందులకు భయమందెదవు? భయము పొందకుము. నరకభిది - నరకముని బోగొట్టు (నరకాసురాంతకుడగు) సరసిజదృశి దేవే - పద్మాక్షుడగు శ్రీ మహావిష్ణువునందు, నిషణ్ణా - నిలిపిన, తావకీ - నీయొక్క. భక్తిరేకా - ఒక్కభక్తిమాత్రమే, అవశ్యం - అవశ్యముగా, తారయిష్యతి - తరింపజేయగలదు.

మ॥ ఘనసంసారపయోధిను త్తరమహా ♦ గంభీరముం దాటగా
నను వేదోయని భీతినందకుము చి ♦ త్తాంభోజమా! శౌరిభా
మనిశాటారి పయోజనేత్రుడు రమా ♦ మంతవ్యుపైభక్తిని
ల్చినతద్భక్తితరింపజేయుమనలన్ ♦ శ్రీమంతమైయొప్పచున్.

తా. మనసా! సంసారసాగరమును దాటుటకింకను విచారణ మేల? శ్రీహరిభక్తి స్థిరముగా కలిగియుండుము. అదియే సర్వకష్టములబాపి యవలీల నవ్వలియొడ్డును జేర్చును. నీకది యొక్కటే శరణ్యమైనదిసుమా.

శ్లో॥ తృష్ణాతోయే మదనపవనో
ద్ధూత మోహోర్మిమాలే
దారావర్తే తనయసహజ
గ్రాహసంఘాకులే చ
సంసారాఖ్యే మహతిజలధౌ
మజ్జతాం న స్త్రిధామన్!
పాదాంభోజే వరద! భవతో
భక్తినావం ప్రయచ్ఛ. ౧౪

టీ. వరద! కృష్ణ! త్రిధామన్! - సర్వవ్యాపీ! తృష్ణాతోయే - ఆశయను జలముగలదియు, మదనపవనోద్ధూత మోహోర్మిమాలే - మన్మథవాయుహతములగు మోహమను అలలచేత నిండినదియు, దారావర్తే - భార్యయను సుళ్ళుగలదియు, తనయసహజగ్రాహసంఘాకులేచ - పుత్రులును

హస్తద్వయమా, శ్రీధరం సమర్చయ - శ్రీధరుని పూజింపుమా, శ్రోత్రద్వయ-శ్రోత్రద్వయమా, త్వం- నీవు, అచ్యుతకథాః శృణు-అచ్యుతకథలను వినుము, లోచనద్వయ- కన్నుదోయీ, కృష్ణం లోకయ - నీలమేఘశ్యాముని చూడుము, అంఘ్రియుగ్మ- పాదద్వయమా, హరేః ఆలయం గచ్ఛ- హరిసన్నిధానమునకు నడువుము, ఘ్రాణ - నాసికా, ముకుందపాదతులసీం జిఘ్ర - ముకుందపాదతులసిని వాసనచూడుము, మూర్ధం - శిరమా, అధోక్షజం నమ- అధోక్షజుని నమస్కరింపుము.

సీ॥ కీర్తింపుమా జిహ్వ! ◆ కేశవు; మానస!
శ్రీమురాంతకుని భ ◆ జింపుమిందు;
కరములు! భక్తి శ్రీ ◆ ధరుని సేవింపుడు;
అచ్యుతదివ్యక ◆ థామృతంబు
శ్రవణేంద్రియములార! ◆ త్రావుడు; కృష్ణుని
చూడరే! వేడుక ◆ చూడ్కులార!
అంఘ్రియుగ్మంబ! శ్రీ ◆ హరిమణిభవనరా
జమునకు వలగొన ◆ జనుము నీవు
గీ. వరముకుందుని శ్రీపాద ◆ వనజనిహిత
దివ్యతులసీసుగంధంబు ◆ భవ్యముగను
ఘ్రాణమొనరింపు నాసికా! ◆ ఘనుఁడధోక్ష
జునకు మ్రొక్కుము శిరమ! జీ ◆ వనముగోరి.

తా. అవయవములారా! మీమీ శక్తుల శ్రీహరిపరంబుగఁ జేసి సార్థకము బొందుఁడు. అన్యథావర్తించిన యనర్థకమేకాని మేలు లేదు. ఈ హితము గ్రహించినచో నిత్యసుఖముకలుగును.

శ్లో॥ హేలోకాః! శృణుత ప్రసూతిమరణవ్యాధేశ్చికిత్సా
మిమామ్। యోగజ్ఞాస్సముదాహరన్తి మునయో యాం

యాజ్ఞవల్క్యాదయః। అన్తర్జ్యోతిరమేయమేకమమృతం కృష్ణాఖ్యమాపీయతామ్॥ తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణ మాత్యన్తికమ్. ౧౭

టీ. హేలోకాః - ఓజనులారా! ప్రసూతిమరణవ్యాధేః - జననమరణము నెడి రోగమునకు, ఇమాంచికిత్సాం - యీచికిత్సను, శృణుత - వినుడు. యాం - ఏదానిని, యోగజ్ఞాః - యోగవిదులైన, యాజ్ఞవల్క్యాదయః - యాజ్ఞవల్క్య మొదలయిన వారు, సముదాహరంతి - వివరించి తెలుపుచున్నారో, అట్టి, అంతః - మనస్సులో, జ్యోతిః - ప్రకాశించునదియు, అమేయం - పరిమితి లేనిదియు, ఏకం - అద్వితీయ మయినదియు, సాటిలేనిదియునగు కృష్ణాఖ్యం - కృష్ణనామముగల, అమృతం - అమృతమును, ఆపీయతాం - చక్కగా పానము చేయబడుగాత! తత్ - అట్టి, పరమౌషధమ్ - సర్వోత్తమమయిన యౌషధము, పీతం - త్రాగబడినదై, ఆత్యంతికం - అంతము లేని, నిర్వాణం - ఆనందమును, వితనుతే - కలిగించుచున్నది.

చం॥ నరవరులీప్రసూతిమర ♦ ణాఖిల రోగహరౌషధంపుసొం
పరయుడు: యాజ్ఞవల్క్యముని ♦ లాదిగ సేవయొనర్చి దీనియం
తరమగు సత్ప్రభావమమృ ♦ తంబని రాద్యమమేయ మవ్యయం
బురుతర కృష్ణనామపర ♦ మౌషధి వాడుడు మోక్షమయ్యెడిన్.

తా. జనులారా! జననమరణమను వ్యాధి యనివార్యముగ బాధించుచున్నదిగదా. ఆవ్యాధికి సరియగునౌషధమును పూర్వము యాజ్ఞవల్క్యాదులు వాడి ధన్యులైరి. హృదయాంతరాళమున స్వయంప్రకాశమైన భగవత్స్వరూపముగలదు. దానిని సేవించినయెడల వ్యాధికుదురుటయే కాక అమందానందము గల్గును.

శ్లో॥ హేమర్త్యాః! పరమంహితంశృణుత వో వక్ష్యామి సంక్షేపతః। సంసారార్ణవ మాపదూర్మిబహుళం సమ్యక్ప్రవిశ్య స్థితాః। నానాజ్ఞాన మపాస్య చేతసి నమోనా

రాయణా యేత్యముమ్। మంత్రం సప్రణవం ప్రణామ
సహితం ప్రావర్తయధ్వం ముహుః॥ ౧౦

టీ. హేమర్త్యాః - ఓమానవులారా! వః - మీకు, పరమం - స
ర్వోత్తమమైన, హితం - హితమును, సంక్షేపతః - సంక్షేపముగా,
వక్ష్యామి - వచించెదను. శృణుత - వినుడు. ఆపదూర్మిబహుళం - ఆపద
యను తరంగములచే బహుళమైన, సంసారార్ణవం - సంసారసముద్రమును.
సమ్యక్ - లెస్సగా, ప్రవిశ్య - చేరి, స్థితాః - ఉండియే. నానాజ్ఞానం - అ
నేకవిధములయిన అజ్ఞానము, అపాస్య - విడిచిపెట్టి, చేతసే - మనస్సునందు
నమోనారాయణాయేతి - నమోనారాయణాయ అనునటి, మంత్రం - మంత్ర
మును, సప్రణవం-ప్రణవముతోగూడినదానినిగను. ప్రణామసహితం - నమ
స్కారముతోగూడినదానిగను, ముహుః- మాటిమాటికిని, ప్రావర్తయధ్వం-
చక్కగా వల్లింపుడు.

చం॥ నరులు! వినుండు సంగ్రహము ♦ నహితమిచ్చెద నా
పదూర్మిసం
సరణపయోధిలోబడి వి♦చారమునొందక మోహాంబులన్
నిరసనమొందజేసి హృది ♦ నిర్మలసప్రణవప్రణామ భా
సురవరమంత్రరాజము వ♦చోవిభవంబుగ జేయుడెప్పుడున్.

తా. సంసారము దుస్తరమైన సముద్రమువంటిది. అందు మాటి
మాటికి సంభవించునాపదలు పైపైవచ్చుతరంగములవంటివి. ఇట్టి దుర్భర
దుఃఖములకు పాల్గాకుండుటకుపాయమొకటి కలదు. నానాజ్ఞానముల త్రోవ
లద్రెంపి నమోనారాయణాయ యను మంత్రమును ప్రణవసహితముగ మరల
మరల నమస్కారపూర్వకముగ వల్లెవేయుటయే సంసారసాగరతరణోపా
యము. కావున మానవులీమార్గమవలంబించిన తప్పక కష్టమునుంచి తొలగి
సుఖమనుభవింతురని నమ్మకము.

శ్లో॥ పృథ్వీ రేణురణుః పయాంసికణికాః ఫల్గుస్స్ఫులింగోనల
స్తేజోనిశ్శ్వసనం మరుత్తనుతరం రంధ్రం సుసూక్ష్మం నభః।
క్షుద్రా రుద్రపితామహప్రభృతయః కీటాస్సమస్తాస్సురాః।
దృష్టే యత్ర స తావకో విజయతే భూమావధూతావధిః॥

టీ. శ్రియఃపతీ! యత్ర - ఎవ్వని, దృష్టే - చూచినట్టయితే, పృథ్వీ - బ్రహ్మాండము, అణుః - అణుమాత్రమయిన, రేణుః - దుమ్ము (అయిచూపట్టునో), పయాంసి - సమస్తజలములున్నూ, కణికాః - చిన్నబిందువులు, (అగునో), తేజః - మహాత్తేజమంతయూ, ఫల్గుస్స్ఫులింగః - మిణుగురుబురుగు (అగునో), మరుత్ - వాయువంతయు, తనుతరం - అతిసూక్ష్మమయిన నిశ్వసనం - ఊర్పు (అగునో), నభః - ఆకాశమంతయు, సుసూక్ష్మం - మిక్కిలి చిన్నదయిన, రంధ్రం - చిల్లి (అగునో), రుద్రపితామహ ప్రభృతయః - రుద్రపితామహాది, సమస్తాస్సురాః - సమస్తదేవతులును, క్షుద్రాః కీటాః - చిన్నపురుగులు (అగుదురో), అట్టి అవధూతావధిః - పరిమితిలేని, తావకః - నీయొక్క, సః భూమాః - ఆవైభవము, విజయతే - సర్వోత్కృష్టమునొందుగాత!

చం॥ ధరణిపరాగ మంబుధివితానము విప్రుషమగ్ని విస్ఫులిం
గరజము రంధ్రమంబరము గాలియు నిశ్వసనంబు లల్పులం
బురుహాభవేంద్రముఖ్యులు క్రిములు సుర లంబుజనేత్ర నీదయా
వరరసదృష్టియందు నని వారణమై ప్రసరింపకుండినన్.

తా. శ్రియఃపతీ! నీకంటె నుత్కృష్టములగు పదార్థము లేవియు లేవు. నీకృపయున్నచో సర్వము సౌఖ్యాకరమే. నీకృపలేనిచో సర్వము అతికష్టభాజనమే. కావున నేను నిన్నుపాసించి తరించెదనుగాత!

శ్లో॥ బద్ధేనా జలినా నతేన శిరసా గాత్రైస్సరోమోద్గమైః
కంఠేన స్వరగద్గదేన నయనే నోద్గీర్ణబాష్పాంబునా
నిత్యం త్వచ్చరణారవిందయుగళధ్యానామృతాస్వాదినా
మస్మాకం సరసీరుహాక్ష సతతం సంపద్యతాం జీవితమ్. ..౨౦

టీ. సరసీరుహాక్ష - పద్మపత్రములవంటి నేత్రములుగలవాడా! స్వామీ! నిత్యం - ఎల్లప్పుడు, త్వచ్చరణారవిందయుగళధ్యానామృతాస్వాదినాం, త్వత్ - నీయొక్క, చరణారవింద - పాదపద్మములయొక్క, యుగళ - జంటను, ధ్యాన - తలంచుట యనెడు, అమృత - అమృతమును, ఆస్వాదినాం - చవిగొనిన, అస్మాకం - మాయొక్క, జీవితం - బ్రదుకు, సతతం - ఎడతెగక, బద్ధేన - బంధింపబడిన, అంజలినా - దోసిలితోను, నతేన శిరసా - వంచినతలతోను, సరోమోద్గమైః - పులకాంకురములతో గూడిన, గాత్రైః - అవయవములతోను, స్వరగద్గదేన - స్వరమందు డగ్గుత్తికపడిన కంఠేన - కంఠముతోను, ఉద్గీర్ణ - పొంగివచ్చుచున్న, బాష్పాంబునా - ఆనందబాష్పములతోను, ( కంఠేన - కంఠముతోను ) సంపద్యతాం - కూడుకొనియుండును గాత!

చం. కనుగవ సమ్మదాశ్రువులు ♦ గద్గదికధ్వని కంఠసీమ మే
నను పులకాంకురంబులు వి ♦ నమ్రశిరస్సును కేలుమోడ్పు పా
వనమగు యుష్మదంఘ్రిశుభ ♦ వారిజశీధురసంబు గ్రోలు జీ
వనమును నిత్యముంగలిగి ♦ వర్ధిలజేయుము శ్రీరమాధిపా!

తా. స్వామీ! మేమెల్లపుడు నీపదధ్యానామృతాస్వాదనము కావించుచు తన్మయత్వమున దేహము సర్వాంగకము పులకీకృతంబులుగా నానందించుచుందుము గాత యని వేడుచున్నవారము.

శ్లో॥ హేగోపాలక! హే కృపాజలనిధే! హేసింధుకన్యాపతే!
హేకంసాంతక! హేగజేంద్రకరుణాపారీణ! హేమాధవ!

హే రామానుజ! హేజగత్త్రియగురో! హేపుండరీకాక్ష!
మాం

హేగోపీజననాథ! పాలయపరంజానామిన త్వాంవినా ౨౧

టీ. హేగోపాలక - ఓగోపాలకా, హేకృపాజలనిధే - ఓకృపాసముద్రుడా! హేసింధుకన్యాపతే - ఓశ్రియఃపతీ. హేకంసాంతక - ఓకంసుసంహారకా! హేగజేంద్రకరుణాపారీణ - ఓగజరాజవత్సలా, హేమాధవ - ఓమాధవా హేరామానుజ - ఓరామానుజా, హేజగత్త్రయగురో - ఓజగత్త్రయగురూ, హేపుండరీకాక్ష - ఓపుండరీకాక్షా, హేగోపీజననాధ - ఓగోపికాలోలా, మాం - నన్ను, పాలయ - పాలింపుము, త్వాంవినా - నినువిడిచి, పరం - ఇతరుని, నజానామి - ఎఱుగను.

మ. హరి! గోపాలక! గోపికారమణ! శ్రీ ♦ రాంభోధి కన్యాపతీ!
కరిరాజావన! సత్కృపాజలనిధీ! ♦ కంసఘ్న! నారాయణా!
పరమానంద! శచీపతీఫణిపతీ ♦ భాషాపతీపార్వతీ
వరదానా! భవదన్యమేనెఱుగ శ్రీ ♦ వర్ణిష్ణు రక్షింపవే!

తా. స్వామీ! నీలీలలు, నీశౌశీల్యము, నీదయ, నీభక్తవాత్సల్యము, నీసౌకుమార్యము, నీచతురత్వము, నీసౌందర్యము, మరియెవ్వరియందుఁగానము. నీవుతప్ప నాకన్యము తెలియదు. కావున నన్ను గాపాడుము స్వామీ!

శ్లో॥ భక్తాపాయభుజంగగారుడమణి స్త్రైలోక్యరక్షామణిః
గోపీలోచనచాతకాంబుదమణి స్సౌందర్యముద్రామణిః
యః కాన్తామణి రుక్మిణీఘనకుచద్వంద్వైక భూషామణి
శ్శ్రేయో దేవశిఖామణి ర్దిశతు నో గోపాలచూడామణిః ౨౨

టీ. యః = ఏకృష్ణమూర్తి, భక్త = భక్తులయొక్క, అపాయ = ఆపదలనెడు, భుజంగ = పాములకు, గారుడమణిః = గరుత్మంతుడైనవాడును, త్రైలోక్యరక్షామణిః - ముల్లోకములను రక్షించువాడును, గోపీ - గోపికలయొక్క, లోచన - నేత్రములకు, చాతక - చాతకపక్షులపాలిటి, అంబుద

మణిః - శ్రేష్ఠమైన మేఘమైనవాడును, సౌందర్యముద్రామణిః - సౌందర్యమునకు ముద్రవేయు రత్నమయినవాడును, కాంతామణి - స్త్రీరత్నమైన, రుక్మిణీ - రుక్మిణీదేవియొక్క, ఘనకుచ - చిక్కనైన స్తనములయొక్క, ద్వంద్వ - జతకు, ఏక - ఒకటైన, భూషామణిః - ఆభరణరత్నమైనవాడును, దేవశిఖామణిః - దేవతాశిరోరత్నము నగుచున్నాడో, (సః - అట్టి) గోపాలచూడామణిః - గోపాలశ్రేష్ఠుడగు శ్రీకృష్ణుడు, నః - మాకు, శ్రేయః శుభములను, దిశతు - ఇచ్చుగాత!

సీ. నిజభక్తజనవిప ♦ ద్భుజగమ్ములకు ఖగ
కులమణి గరుడుఁడై ♦ వెలయు నెవఁడు,
ముల్లోకములఁ దన ♦ బొజ్జలో నిడికొని
కాచెడు నారక్ష ♦ కమణి యెవఁడు,
సకలగోపీనేత్ర ♦ చాతకముల దప్పి
కడు నీరమొసఁగు మే ♦ ఘమణి యెవఁడు,
అందాల కచ్చు వే ♦ యుందగు మణియాతఁ
డనఁగ నొప్పులకుప్ప ♦ యగు నెవండు,
తే॥ గీ॥ రుక్మిణీసతీ ఘన వక్ష ♦ రుహయుగాగ్ర
మున వెలుఁగు భూషలలోన ♦ భూషణమణి
యెవ్వఁ? డెవ్వాఁడు దేవదే ♦ వేశ్వరమణి
యట్టి గోపమణి యిడు శ్రే ♦ యముల మాకు.

తా. శ్రీకృష్ణుడు భక్తులకష్టముల దీర్చువాడు, దేవతాశిరోమణి, సుందరరూపుడు గోపికావల్లభుడు, రుక్మిణీప్రాణలోలుడు. గోపబాలుడై విహరించు నట్టి శ్రీకృష్ణుడు మాకు సర్వశ్రేయము లొసంగి రక్షించుగాత!

శ్లో॥ శత్రుచ్ఛేదైకమంత్రం సకలముపనిష
ద్వాక్యసంపూజ్యమంత్రం

సంసారోత్తారమంత్రం సముపచితతమ
స్సంఘనిర్యాణమంత్రం
సర్వైశ్వర్యైకమంత్రం వ్యసనభుజగసం
దష్టసంత్రాణమంత్రం
జిహ్వే! శ్రీకృష్ణమంత్రం జపజప సతతం
జన్మసాఫల్యమంత్రం॥ ౨౩

టీ. జిహ్వే - నాలుకా! శత్రుచ్ఛేదైకమంత్రం - శత్రువుల సంహారించుటయందు ముఖ్యమైన మంత్రము, సకలం - సకలమైన, ఉపనిషద్వాక్యసంపూజ్యమంత్రం - ఉపనిషద్వాక్యములచే మిక్కిలి పూజింపదగిన మంత్రము, సంసారోత్తారమంత్రం - సంసారమునుండి తరింపజేయునట్టి మంత్రము, సముపచిత - వృద్ధిపొందిన, తమస్సంఘ - చీకటిమొత్తములను, నిర్యాణమంత్రం - పోగొట్టునట్టి మంత్రము, సర్వైశ్వర్యైకమంత్రం - సకలవిధములయిన ఐశ్వర్యములకు, ఏకమంత్రం — ముఖ్యమైనమంత్రము, వ్యసనభుజగ - వ్యసనములను సర్పములచేత, సందష్ట - గట్టిగా కరవబడినవారిని, సంత్రాణమంత్రం - కాపాడుమంత్రము, జన్మసాఫల్యమంత్రం - జన్మమును సఫలీకృతము చేయు మంత్రము, (అయిన) శ్రీకృష్ణమంత్రం — అను శ్రీకృష్ణమంత్రమును, సతతం - ఎడతెగక, జపజప - జపింపుము, జపింపుము.

సీ॥ బహిరంతరాది వి ♦ భంజనమంత్రంబు
శ్రుతిశతమౌళి శో ♦ భితసుమంత్రి
మతిఘోరవిషమ సం ♦ స్మృతి సముత్తారక
మంత్రంబు మరణస ♦ మయశరీర
సంగనిర్యాణ ని ♦ శ్చలమంత్రిరాజంబు
సకలలౌకికపరై ♦ శ్వర్యమంత్రి

మల సఘమజగఘ ♦ ణావళీదష్ట సం
త్రాణమంత్రంబు సు ♦ త్రామవిబుధ
గీ॥ మానిమానసమంత్రంబు ♦ మధువిరోధి
మాధవాచ్యుతగోవింద ♦ శ్రీధరాది
పరమపావన జన్మసా ♦ ఫల్యమైన
కృష్ణమంత్రంబు జిహ్వా! కీ ♦ ర్తించుమెపుడు.

తా, జిహ్వా! సకలవిధముల శుభప్రదంబగు శ్రీకృష్ణమంత్రమును తనివితీర కీర్తించుమా!

శ్లో॥ వ్యామోహప్రశమౌషధం మునిమనోవృత్తిప్రవృత్త్యౌషధం
దైత్యేంద్రార్తికరౌషధం త్రిభువనీసంజీవనైకౌషధం
భక్తాత్యంతహితౌషధం భవభయప్రధ్వంసనైకౌషధం
శ్రేయఃప్రాప్తికరౌషధం పిబ మనశ్శ్రీకృష్ణదివ్యౌషధం ౨౮

టీ. మనః - మనసా, వ్యామోహప్రశమౌషధం - అజ్ఞానమును హరించుమందు, మునిమనః - మునిమనోవ్యాపారముయొక్క, ప్రవృత్తి - నడవడికకు, ఔషధం - నివారకమైనమందు, దైత్యేంద్రార్తికరౌషధం - రాక్షసుల కారాటము గలిగించుమందు, సంజీవనైకౌషధం - బ్రతికించునట్టిమందు, భక్తాత్యంతహితౌషధం - భక్తులకు మిక్కిలి హితముసేయుమందు, భవ, భయ - సంసారమువలని భయమును, ప్రధ్వంసన - నశింపజేయుటయందు, ఏక - ముఖ్యమైన, ఔషధం - ఔషధము, శ్రేయఃప్రాప్తికరౌషధం - శుభములబొందజేయునట్టి యౌషధము, ఇట్టి, శ్రీకృష్ణదివ్యౌషధమును, పిబ - పానముచేయుమా!

సీ॥ వ్యామోహశమన ది ♦ వ్యౌషధశ్రేష్ఠంబు
మునిజనమానసాం ♦ భోజవర్త

మానౌషధం బన ♦ మానదైత్యేంద్రార్తి
కరవరౌషధము భ ♦ క్తప్రజార్తి
హరణౌషధంబు సం ♦ సరణభయచ్ఛేద
కరవరౌషధము లో ♦ కత్రయైక
జీవనౌషధము సం ♦ శ్రితబృందశ్రేయః ప
రంపరాప్రాప్తి క ♦ రప్రకృష్ట

గీ॥ పరమదివ్యౌషధంబు ధీ ♦ భక్తిపీత
రాగరసదౌషధంబు శ్రీ ♦ రామకృష్ణ
మంత్రరూపౌషధంబు శ్రీ ♦ మంతముగను
రసన! పానంబు సేయు ని ♦ రంతరంబు.

తా. రసనా! శ్రీకృష్ణదివ్యౌషధమును త్రావుమా! సమస్తరోగము లను హరించి మహారోగ్యము కల్గునుమా!

శ్లో॥ ఆమ్నాయాభ్యసనా న్యరణ్యరుదితం వేదవ్రతాన్యన్వహం
మేదశ్ఛేదఫలాని పూర్తవిధయ స్సర్వే హుతం భస్మని
తీర్థానా మవగాహనానిచ గజస్నానం వినా యత్పద
ద్వంద్వాంభోరుహ సంస్మృతీ ర్విజయ తే దేవ స్సనారాయణః.

టీ. యత్ - ఏశ్రీమన్నారాయణుని యొక్క, పదాంభోరుహ - పాదపద్మములయొక్క, సంస్మృతీః - తలంపును, వినా - తప్పినయెడల, ఆమ్నాయాభ్యసనాని - వేదాభ్యాసములు, అరణ్యరుదితం - అరణ్యరోదన మో, అన్వహం - ప్రతిదినమును, వేదవ్రతాని - వేదవ్రతములు, మేదశ్ఛేద ఫలాని - మేదస్సును పోగొట్టుటయే ఫలముగాగలవగునో, సర్వే - సమస్త ములయిన, పూర్తవిధయః - పూర్తకర్మలు, భస్మనిహుతం - బూడిదయందు హోమము చేయుటయగునో, తీర్థానాం - తీర్థములయొక్క, అవగాహనా

నిచ - మణకలు, గజస్నానం - యేనుగు చేసినస్నానమువంటిదగునో, అట్టి, దేవదేవః - స్వయంప్రకాశుడగు, సః నారాయణః - ఆనారాయణుడు - విజయతే - సర్వోత్కృష్టుడగుగాక.

సీ॥ వేదపాఠం బట ♦ వీరోదనంబగు
　　　వేదవ్రతాది స ♦ ద్విహితవిధులు
యజ్ఞసంబంధంబు ♦ లగు పశుమేధ వి
　　　చ్ఛేదన ఫలమని ♦ చెప్పబడును
సకలపూర్తాహ్వయ ♦ సత్ఫలాచరణలు
　　　భస్మాహుతులనంగ ♦ బరిఢవిల్లు
పుణ్యనదీనదాం ♦ భోవగాహనములు
　　　గజపదిస్నాన ప్ర ♦ కారమగును
గీ॥ స్వామి! యేనీపదాంబుజ ♦ స్మరణరహిత
సుకృతములు దుష్కృతంబులు ♦ సుభగచరిత
శౌరి నారాయణుడు కృపా ♦ సాగరుండు
విజయములు చెందు ధ్యేయుడై ♦ విజయసఖుడు.

తా. ఎవని మరచిచేయు వేదాధ్యయనము లటవీరోదనములో? ఎవనిమరచిచేయు సద్వ్రతములు మేదశ్ఛేదఫలప్రదములో, ఎవనిమరచిచేయు పుణ్యనదీస్నానములు గజపదిస్నానములగునో అట్టిసర్వోత్కృష్టుండగు శ్రీమన్నారాయణుడు నాహృత్కమలవాసియై నన్నెడబాయకుండుగాక!

శ్లో॥ శ్రీమన్నామప్రోచ్య నారాయణాఖ్యమ్
　కే నప్రాపు ర్వాంఛితం పాపినోపి
హా! నః పూర్వం వాక్ప్రవృత్తాన తస్మిన్
తేన ప్రాప్తమ్ గర్భవాసాదిదుఃఖమ్. ౨౬

టీ. నారాయణాఖ్యం - నారాయణయనునట్టి, శ్రీమత్ - సకల సంపదలు గల, నామ - నామధేయమును, ప్రోచ్య - పలికి, కే - ఎవరు, పాపినోపి - పాపాత్ములయినను, వాంఛితం - ఇష్టము, నప్రాపుః - పొందరు? హా ! - అయ్యో ! పూర్వం - మునుపు, వాక్ - నోరు, తస్మిన్ - ఆనారాయణుని నామమందు, నప్రవృత్తా - నడవకపోయెను. తేన - ఆకారణముచేత, గర్భవాసాదిదుఃఖం - గర్భమందుండి దుఃఖము, ప్రాప్తం - ప్రాప్తించినవి.

ఉ. శ్రీయుతమై మునిప్రకర ♦ సేవితమై చెలువొందు భవ్యనా
రాయణనామసంస్మరణ ♦ రాణనొనర్చి తరింప డెవ్వడ
య్యో! యవివేకినై మొదటి ♦ నుండియు నేమరి గర్భవాసదుః
ఖాయతనుండనైతి బ్రతు ♦ కంతయు దుఃఖవిభాజనంబెకా॥

తా. ఎట్టిపాపకర్ములయినను నారాయణనామస్మరణచే ధన్యులై పునర్జన్మ లేనివారగుచుండగా యింతదనుక తద్భాగ్యమునకై ప్రయత్నించక గర్భవాసాది దుఃఖముల బొందితిని. ఇకనైనను శ్రీహరినామస్మరణ కావించి తరింతునుగాత!

శ్లో॥ మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే!
మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏషఏవ
త్వద్భృత్య భృత్య పరిచారక భృత్యభృత్య
భృత్యస్య భృత్య ఇతి మాంస్మర లోకనాథ! ౨౭

టి. మధుకైటభారే - మధుకైటభులను సంహారించినస్వామీ ! మజ్జన్మనః - నాపుట్టువునకు, ఫలం - ప్రయోజనము, ఇదం - ఇయ్యది, మత్ప్రార్థనీయః - నేను వేడవలసినదియు, మదనుగ్రహః - నాయందనుగ్రహింప దగినదియు, ఏషఏవ - యియ్యదిగేనుమా (ఏదనగా) త్వద్భృత్య - నీసేవకునికి, భృత్య - సేవకుడైన వానియొక్క, పరిచారక - సేవకునియొక్క, భృత్య - భృత్యునికి, భృత్య - సేవకుడైనవానికి, భృత్యస్య - సేవకునియొక్క,

భృత్య ఇతి - సేవకుడని, మాం - నన్ను, లోకనాథ! - జగములేలు స్వామీ, స్మర - తలంపుము.

క. శ్రీసఖ! నే ధరబుట్టిన
వాసికి మత్ప్రార్థనీయ ♦ వాంఛిత మిది నీ
దాసానుదాసదాసీ
దాసునిగా తలపు లోన ♦ దానాధీశా॥

తా. నేను నీచుడ నగుట నిజము. అయినను నాజన్మ సార్థకమగునట్లు నీదాసులయందు కడపటివానినిగా భావింపుము. నాకిట్టిదియే చాలును. ఇంతకన్న నాకుకోరదగినది లేదు. ఇంతమాత్రము దీనుడనగు నాకు దయ చేయదగినదే కదా!

శ్లో॥ నాథే నః పురుషోత్తమే త్రిజగతా మేకాధిపే చేతసా
సేవ్యే స్వస్యపదస్య దాతరి సురే నారాయణే తిష్ఠతి
యం కంచిత్పురుషాధమం కతిపయగ్రామేశ మల్పార్థదం
సేవాయై మృగయామహే నర మహో! మూఢా వరా
[కా వయమ్. ౨౮

టీ. నః - మాకు, నాథే - పాలకుడై, పురుషోత్తమే - పురుషులలో శ్రేష్ఠుడై, జగతాం - మూడులోకములకు, ఏకాధిపే - తానొక్కడే యధిపతియై, చేతసా - మనస్సుచేత, సేవ్యే - సేవింపదగినవాడై, స్వస్య - తనయొక్క పదస్య - స్థానమును, దాతరి - ఇచ్చువాడై, సురే - మరణములేనివాడై, నారాయణే - సర్వాంతర్యామియైన భగవంతుడు, తిష్ఠతి - ఉండగా, యంకంచిత్ - ఒకానొక, పురుషాధమం - పురుషులలో అంధతముడై, కతిపయగ్రామేశం - కొన్నియూళ్ళకుమాత్రము దొరయై, అల్పార్థదం - కొంచెముమాత్రము ధనమిచ్చువాడై, నరం - ఎప్పుడో ఒకప్పుడు క్షయించుచునాతని, మృగయామహే - వెదకుచున్నాము. అహో - అయ్యో! వయం - మేము, మూఢాః - వివేకహీనులము, వరాకాః - నీచులము.

మ॥ పురుష శ్రేష్ఠుఁడు లోకనాథుఁడు కృపా♦పూర్ణుండు సేవ్యుండు శ్రీ
హరి నారాయణుఁ డాశ్రితాళికి నిజ ♦ స్థానప్రదానుండు శ్రీ
కరుఁడుండఁగ నరు నల్పమూర్ఖు కతిపయ♦గ్రామేశు నల్పార్థుఁగాఁ
బరిసేవింపఁగఁ బోవుచుండెదము వి♦భ్రాంతిన్ మహామూఢతన్

తా. అక్షయసంపదలొసంగు దాతయై పురుషోత్తముండగు లోక నాథుఁడుండఁగా అల్పార్థుండై పురుషాధముండగు కతిపయగ్రామేశుని యాచించి మూర్ఖులమగుచున్నాముకదా!

శ్లో॥ మదన! పరిహర స్థితిం మదీయే
మనసి ముకుందపదారవిందధామ్ని
హరనయనకృశానునా కృశోఽసి
స్మరసి న చక్రపరాక్రమం మురారేః. ౨౯

టీ. మదన - మన్మథా! ముకున్ద - శ్రియఃపతియొక్క, పదారవింద - పాదపద్మములను, ధామ్ని - నివాసమైన, మదీయే - నాయొక్క, మనసి - మనస్సునందు, స్థితిం - ఉండుటను, పరిహర - వదలుకొనుము, హర - శంకరునియొక్క, నయన - నేత్రమందలి, కృశానునా - అగ్నిచేత, కృశః - క్షీణించినవాడవు, అసి - అయితివి, మురారేః - శ్రీవిష్ణునియొక్క, చక్రపరాక్రమం - చక్రముయొక్క బలమును, నస్మరసి - యెఱుఁగవు కాఁబోలు!

చ. మనసిజ! శ్రీముకుందపద ♦ మందిరమైన మదీయచిత్తమం
దున, నివసింపఁగావలదు ♦ ధూర్జటినేత్రకృశానలన్ వినా
శనమయిపోయితీవు, మురర ♦ సాహరుచక్రపరాక్రమంబు నీ
మనమున సంస్మరించకను ♦ మానితి వేమనవచ్చు దుర్మతీ!

తా. మన్మథా! శ్రీవిష్ణుపాదారవిందముల సదా ధ్యానించు నా మనస్సు జేరనుంకింతువేమోకాని కొంచెము యోచించి పనిచేయుము. నీవొకప్పు

డు శంకరుని నేత్రకృశానుకీలలచే భగ్నీకృతుడవై చెడియుంటివి. శ్రియఃపతి చక్రపరాక్రమము కొంచెముధ్యానించి నీతలంపును మానుకొనుము. లేదేని అవమానాస్పదుడవగుదువు సుమా!

శ్లో॥ తత్త్వం బ్రువాణాని పరం పరస్మా
న్మధు క్షరంతీవ సతాంఫలాని!
ప్రావర్తయ ప్రాఞ్జలి రస్మి జిహ్వే!
నామాని నారాయణగోచరాణి. 30

టీ. జిహ్వే - నాలుకా! పరస్మాత్ - ఉత్తమమైనదానికంటె, పరం - ఉత్తమమైన, తత్త్వం - వాస్తవమైనవృత్తాంతమును, బ్రువాణాని - చెప్పుచున్నాను. సతాం - సజ్జనులకు, మధుక్షరంతీవ - తేనెలొలుకుఫలములగు, నారాయణగోచరాణి - నారాయణసంబంధములగు, నామాని - నామములను, ప్రావర్తయ - పునఃపునః వర్ణింపుము నీకు, ప్రాంజలిఃఅస్మి - చేమొగ్గితినికదా!

క. పరమోత్తమోత్తమంబగు
పరమార్థము వినుము రసన! ♦ మధువొల్కెడు శ్రీ
హరి నారాయణనామ
స్మరణము గావింపు నీకు ♦ ప్రాంజలిసేతుక్.

తా. రసనా! నిన్నర్థించి యొక్కపరమార్థము వేడెదవినుము. భక్తజనులకు జన్మసాఫల్యములగు మధురాతిమధురములగు శ్రీనారాయణనామస్మరణము కావింపుము.

శ్లో॥ ఇదంశరీరం పరిణామపేశలం
పతత్యవశ్యం శ్లథసన్ధిజర్ఝరమ్
కిమౌషధైః క్లిశ్యసి మూఢదుర్మతే!
నిరామయం కృష్ణరసాయనం పిబ. 31

టీ. ఇదంశరీరం - ఈశరీరము, శ్లథసంధిజర్ఝరం - శిథిలసంధులచేదుర్బలమైనది, పరిణామపేశలం - వయసుమారినకొలది భిన్నభిన్నరూపములనొందునది (అనగా అవస్థలపాలగును). మూఢ, దుర్మతే - దుర్బుద్ధీ! ఔషధైఃకిం క్లిశ్యసి - ఔషధములచే యెందుకు శ్రమపడుదువు, నిరామయం - ఏరోగముదరిచేరనీయని, కృష్ణరసాయనం - శ్రీకృష్ణనామౌషధమును, పిబ - త్రాగుమా!

ఉ॥ మానవ!మూఢచిత్త!వినుమానుషదేహము నూరుసంధులా
దానను మేలులేదు,సతతంబును వృద్ధిలయంబునొందు నూ!
దీనికి నేదొయౌషధము తెమ్మని వేడెదు, కృష్ణ మాధవ
ధ్యానరసాయనంబుప్రియదంబునగ్రోలు నిరామయంబగున్

తా॥ ఈశరీరము అనేక వికృతులకు, రోగములకు పుట్టినిల్లు. దీనివలన దుఃఖమేగాని సుఖములేదు. ఇందుగురించి యెన్ని ఔషధముల వాడినను రోగజరామరణాది బాధలు నశింపవు. కనుక యిట్టియుపద్రవముల బాపుకొనుటకు నారాయణనామస్మరణ మొక్కటియే నమ్మకమైన మందు. కావున ఓమూఢమానవా! హరినామస్మరణ చేసి తరింపుము.

శ్లో॥ దారా వారాకరవరసుతా తే తనూజో విరించిః
స్తోతా వేదస్తవసురగణోభృత్యవర్గ ప్రసాదః
ముక్తి ర్మాయాజగ దవికలం తావకీ దేవకీ తే
మాతామిత్రంవలరిపుసుతస్త్వయ్యతోన్యన్నజానే.౩౨

టీ. స్వామీ! తే - మీకు, దారా - భార్య, వారాకరవరసుతా - సముద్రుని వరకుమారియగు లక్ష్మీదేవి, తనూజః - కుమారుడు, విరించిః - బ్రహ్మ, స్తోతా - స్తోత్రముచేయువారు, వేదః - వేదములు, తవభృత్యవర్గః- మీసేవకబృందము, సురగణః - దేవతాగణము, ప్రసాదః - మీ అనుగ్రహము, ముక్తిః - మోక్షము, మాయ - కల్పన, అవికలంజగత్ - సమస్తజగములు, తావకీ మాతా - తమతల్లి, దేవకీ - దేవకీదేవి, మిత్రం - స్నేహి

తుడు, వలరిపుసుతః - నరుడు అర్జునుడు, త్వయి - నీయందు, అతః - దీని కంటె, అన్యత్ - మరియొక సంగతి, నజానే - ఎరుగను - సుమా.

ఉ॥ స్తోతలు వేదశాస్త్రములు ♦ సూనుడు బ్రహ్మ వధూరమాంగనా
మాతయు దేవకీ సురస ♦ మాజము భృత్యులు నీదయారసా
జాతము ముక్తియీజగము ♦ లన్నియు మాయ నరుండు స్నేహమీ
రీతికి నన్య మెనెరుగ ♦ శ్రీమహిళాధరణీసతీపతీ!

తా. శ్రీపతీ! నీభార్య లక్ష్మీదేవియనియు, నీ పుత్రుడు బ్రహ్మయనియు, నీస్తోత్రపాఠకులు వేదములనియు, నీసేవకులు దేవతలనియు, నీయనుగ్రహమే మోక్షమనియు, నీ మాయయే సకలసృష్టియనియు, నీ తల్లి దేవకీదేవియనియు నీస్నేహితుడు పాండవేయుడనియు మాత్రమే నేను తెలిసికొనగలిగితిని; నీ మహిమ నెరుగుట యెవ్వరితరము? అవాఙ్మానసగోచరుడవగు నీ ప్రభావ కనుంగొనుట కెవ్వరునుచాలరు.

శ్లో॥ కృష్ణో రక్షతు నో జగత్త్రయగురుః కృష్ణం నమస్యామ్యహం
కృష్ణేనామరశత్రవో వినిహతాః కృష్ణాయ తస్మై నమః
కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోస్మ్యహం
కృష్ణే తిష్ఠతి సర్వమేతదఖిలం హేకృష్ణ! రక్షస్వ మామ్॥33

టీ. జగత్త్రయగురుః - మూడులోకములకు గురువైన, కృష్ణః - కృష్ణుడు నఃరక్షతు - మమ్మురక్షించుగాత, అహం - నేను, కృష్ణం - కృష్ణునిగూర్చి నమస్యామి - నమస్కరింతును, కృష్ణేన - కృష్ణునిచేత; అమరశత్రవః - రాక్షసులు; వినిహతాః - చంపబడిరి; తస్మైకృష్ణాయ - ఆకృష్ణునికొరకు; నమః - నమస్కారము; ఇదంజగత్ - యీలోకమంతయు; కృష్ణాదేవ - కృష్ణునివలననే; సముత్థితం - పుట్టినది; అహం - నేను; కృష్ణస్య - కృష్ణునికి; దాసోస్మి దాసుడనగుచున్నాను; ఏతదఖిలంవిశ్వం - యీ ప్రపంచమంతయు, కృష్ణే - కృష్ణుని యందు; తిష్ఠతి - ఉన్నది; హే కృష్ణ - ఓ కృష్ణా; మాం - నన్ను రక్షస్వ - కాపాడుము.

సీ. త్రిజగద్గురుండైన ♦ శ్రీకృష్ణదేవుండు
శ్రీకరంబుగను ర ♦ క్షించు మనల
నిరతంబు శ్రీకృష్ణు ♦ నికి భక్తి మ్రొక్కుడు
కృష్ణుచె సకల శ ♦ క్షి తులు సంహ
రించంగబడిరి శ్రీ ♦ కృష్ణునకును నమ
స్కారము సేయుడు ♦ త్కంతతోడ
నుద్ధరించెను కృష్ణు ♦ డిద్ధతేజుడు దృశ్య
మానజగంబు ల ♦ నూనముగను

గీ. కృష్ణదాసుండనైతిని ♦ కేవలముగ
విశ్వమెల్లను కృష్ణులో ♦ విశ్రమించె
కృష్ణ! కృష్ణా! యటంచు కీ ♦ ర్తించునట్టి
నన్ను రక్షించు కృష్ణ ప్ర ♦ సన్నవదన!

తా॥ కృష్ణా! నిన్నే సర్వవిధముల రక్షకునిగా నమ్మియుంటిని. మనోవాక్కాయకర్మములందును నిన్నే కొల్తును. నన్ను రక్షించుభారము నీదేసుమా.

శ్లో॥ తత్త్వం ప్రసీద భగవన్ కురు మయ్యనాథే
విష్ణో! కృపాం పరమకారుణికః కిల త్వమ్
సంసారసాగరనిమగ్న మనంత! దీన
ముద్ధర్తు మర్హసి హరే! పురుషోత్తమోసి॥ 38

టీ. భగవన్ - భగవానుడా! విష్ణో - విష్ణుమూర్తి! తత్ - అందువలన, త్వం - నీవు, అనాథే - యేదిక్కులేని, మయి - నాయందు, కృపాం కురు - దయచేయుము స్వామీ, త్వం - నీవు. పరమకారుణికఃకిల - మిక్కిలి దయగలవాడవుకదా, అనంత - అంతములేనివాడా, హరే - శ్రీహరీ, పురుషోత్తమఃఅసి - పురుషశ్రేష్ఠుడవుకదా! సంసారసాగరనిమగ్నం - సంసా

రసముద్రమున మునిగి చిక్కుపడిన; దీనం - దీనుని; మాం - నన్ను; ఉద్ధర్తుం - ఉద్ధరించుటకు; అర్హసి - తగుదువుకదా.

చం॥ హరుడవు పూరుషోత్తముడ ♦ వర్హుడవాద్యుడవో పరాత్పరా!
పరమకృపాసముద్రుడవు ♦ భక్తజనావన! విష్ణు! నీవు గా
కొరులుగలారె బ్రోచుటక ♦ హా! ననుదీనుని ఘోరదుఃఖసం
సరణపయోధి మగ్నుని ని ♦ జమ్ముగ నమ్మితి నిన్నె మాధవా॥

తా. స్వామీ! దిక్కులేక దీనత్వమున సంసారబాధల నందుచున్న నన్ను రక్షించుటకు పరమకృపాసముద్రుడవగు నీవు తప్ప నొరులెవ్వరు లేరని నమ్మితి. నా నేరములనెంచి నన్ను రక్షింపుము స్వామీ!

శ్లో॥ నమామి నారాయణపాదపంకజమ్
కరోమి నారాయణపూజనం సదా
వదామి నారాయణనామనిర్మలమ్
స్మరామి నారాయణతత్త్వ మవ్యయమ్. 3౫

టీ. నారాయణ పాదపంకజం - నారాయణ పాదపద్మమ్ములను, నమామి - నమస్కరించుచున్నాను. నారాయణపూజనం - నారాయణపూజను, సదాకరోమి - ఎల్లప్పుడును చేయుచున్నాను, నిర్మలం - పవిత్రమైన, నారాయణనామ - నారాయణునియొక్క నామమును, వదామి - ధ్యానించుచున్నాను. అవ్యయం - వ్యయముకాని తరుగని, నారాయణతత్త్వం - నారాయణ పరమార్థమును, స్మరామి - తలంచుచున్నాను.

గీ॥ అంజలియొనర్తు నారాయ ♦ ణాంఘ్రులకును
అర్చగావింతు నారాయ ♦ ణాహ్వయునకు
అనువచింతును నారాయ ♦ ణాఖ్యమెపుడు
తలతు నారాయణుని పర ♦ తత్త్వరమను.

తా. నారాయణ పాదపద్మములను వందన మాచరింతును. నారాయణుని చేతులార పూజింతును. వాక్కుచే నారాయణనామస్తోత్రమును చేయుదును. మనస్సుచేత నారాయణపరతత్వమును సదా ధ్యానము చేయుదును.

శ్లో॥ శ్రీనాథ! నారాయణ! వాసుదేవ!
శ్రీకృష్ణ! భక్తప్రియ! చక్రపాణే!
శ్రీపద్మనాభాచ్యుత! కైటభారే!
శ్రీరామ! పద్మాక్ష! హరే! మురారే! ౩౬

టీ. శ్రీనాథ - శ్రీపతి! నారాయణ-నాశములేనివాడా! వాసుదేవ-వసుదేవకుమారా! శ్రీకృష్ణ - మంగళప్రదమగు నీలమేఘచ్ఛాయకలవాడా! భక్తప్రియ - భక్తులకు ప్రియుడైనవాడా! చక్రపాణే - హస్తమున చక్రము ధరించినస్వామీ! శ్రీపద్మనాభ - బొడ్డుకెందామరగలదేవా! అచ్యుత - విడువబడినవాడా! ప్రముఖుడా! కైటభారే - కైటభుడను రాక్షసుని సంహరించిన మహానుభావా! శ్రీరామ - లక్ష్మీదేవిని రంజింపువాడా! పద్మాక్ష - కమలములకీడగు నేత్రములుగల స్వామీ! హరే - భక్తులపాపముల హరించువాడా! మురారే - ఓ మురాంతకా!

శా॥ శ్రీరామాచ్యుత! వాసుదేవ! హరి!లక్ష్మీనాథ!గోవింద!శంసారీ! భూధర! పద్మనాభ! విలసచ్చక్రాంక! దామోదరా!
కారుణ్యాంబుధి! కైటభారి! వరదా! కౌమోదకీశార్ఙ్గ! సద్ధారేయోజ్జ్వలపీతవాస! మునిభక్తవాశ్రిత చింతామణీ!

తా. సంబోధనము. సుగమము.

శ్లో॥ అనన్త! వైకుంఠ! ముకుంద! కృష్ణ!
గోవింద! దామోదర! మాధ వేతి

వక్తుం సమర్థోపి న వక్తి కశ్చిత్
అహో జనానాం వ్యసనాభిముఖ్యమ్. 32

టీ. అనంత - అంతములేనివాడా! వైకుంఠ - వైకుంఠవాసా! ముకుంద! కృష్ణ! గోవింద! దామోదర! మాధవ! ఇతి - ఈప్రకారముగా వక్తుం - పలుకుటకు; సమర్థోపి - శక్తికలవారైనను; కశ్చిత్ - ఒకానొకడును; నవక్తి - పలుకడు; అహో - అయ్యో; జనానాం - జనులకు; వ్యసనాభిముఖ్యం - దుష్కార్యములయం దాసక్తి మెండుకదా!

గీ. మాధవానంత వైకుంఠ ♦ మధువిరోధి
నందనందన కృష్ణ గో ♦ విందశౌరి
యనుచు స్మరియింపగల్గి ను ♦ ర్వ్యసనకలిత
మతిని స్మరియింప రే లోకో ♦ మనుజులకట!

తా. భగవద్ధ్యానము చేయుటకు సమర్థతకలవారయ్యు ద్యూతాదివ్యసనములచే కాలము వ్యర్థ మగుచుండుట యెంత యన్యాయము! పఠించిన మాత్రము చేతనే సులభముగ అభీష్టఫలములనొసంగు భగవన్నామ సంకీర్తన వదలి పలుకష్టముల ననుభవించుచున్నైన దుర్వ్యసనకలితులగుమానవుల నెంచిన యేమితోచగలదు? కడుశోచనీయముగదా!

శ్లో॥ ధ్యాయన్తి యే విష్ణు మనంత మవ్యయమ్
హృత్పద్మమధ్యే సతతం వ్యవస్థితమ్
సమాహితానాం సతతాభయప్రదమ్
తే యాన్తి సిద్ధిం పరమాంచ వైష్ణవీమ్॥ 33

టీ. యే-ఎవరు, అనన్తం - అంతములేనివాడును, హృత్పద్మమధ్యే - హృదయకమలమునడుమ, సతతం - ఎల్లప్పుడు, వ్యవస్థితం - నిలచియున్న

వాడును, సమాహితానాం - స్థిరచిత్తముగలవారికి, సతతాభయప్రదం - యెల్లప్పుడును అభయమిచ్చువాడును అగు, విష్ణుం - విష్ణుమూర్తిని, ధ్యాయంతి - ధ్యానించుచున్నారో, తే - వారు, పరమాంచ - సర్వోత్కృష్టమయిన, వైష్ణవీం - విష్ణుసంబంధమైన, సిద్ధిం - ఫలప్రాప్తిని, యాంతి - పొందుచున్నారు.

గీ॥ విష్ణు నవ్యయు ననంతు వ ♦ ర్ధిష్ణు జిష్ణు
హృదయకమలాంతరస్థు ను ♦ స్థిరమనస్క
సంతతాభయదుండైన ♦ స్వామిగొల్వ
పరమవైష్ణవపదవి సం ♦ ప్రాప్తమగును.

తా. శ్రియఃపతి, సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందుండువాడును, అనంతకళ్యాణగుణములు కలవాడును అయియున్నవాడు. సకలప్రాణుల యొక్కయు, హృదయాంతరంగముల నివసించియుండువాడు. స్థిరమనస్సుకల వారికెల్లప్పుడు తోడునీడయై యుండువాడు. అట్టిశ్రియఃపతిని యెవరుధ్యానింతురో వారికి సకలాభీష్టములు సమకూరును.

శ్లో॥ క్షీరసాగరతరంగ శీకరా
సారతారకితచారుమూర్తయే
భోగిభోగశయనీయశాయినే
మాధవాయ మధువిద్విషే నమః॥ ౩౬

టీ. క్షీరసాగర - పాలసముద్రమందలి, తరంగ - అలలయొక్క, శీకర - తుంపరలయొక్క, ఆసార - వర్షముచేత, తారకిత - చుక్కలు వడిన, మూర్తయే - శరీరముకలవాడును, భోగి - ఆదిశేషునియొక్క, భోగ - పడగలయొక్క, శయనీయ - మంచముపై, శాయినే - పండుకొన్న వాడును, మాధవాయ - లక్ష్మీదేవికిపతియైనవాడును, మధువిద్విషే - మధు నామరాక్షసునకు పగతుడయిన శ్రియఃపతికి, నమః - నమస్కారము.

కం. క్షీరార్ణవోర్మిశీకర
చారుప్రభా దేహా! శేష ♦ శయన! నవక్షపాం
భోరాశి! నీరజాక్షా!
దారుణమధుహరణ! మ్రొక్కె ♦ దను శ్రీరమణా॥

తా. శ్రియఃపతి క్షీరసాగరతరంగముల మధ్యమున శేషపర్యంకడోలికపై లక్ష్మీసమేతుడై యూగుచు తత్తరంగతుంపరలు నల్లనిదేహముపైబడి నీలవర్ణాకాశమున ప్రకాశించునక్షత్రములపగిది ప్రకాశించుచున్న శ్రీమన్నారాయణుని మనస్సుచే పలువిధముల ధ్యానించి నమస్కరించుచున్నాను.

శ్లో॥ యస్యప్రియౌ శ్రుతిధరౌ కవిలోకవీరౌ
మిత్రే ద్విజన్మవరపద్మశరావభూతామ్
తేనాంబుజాక్షచరణాంబుజషట్పదేన
రాజ్ఞాకృతా కృతిరియం కులశేఖరేణ॥ ౪౦

టీ. యస్య - ఎవ్వనికి, ప్రియౌ - ప్రియులై, శ్రుతిధరౌ - వేదములను ధరించినవారై, కవిలోకవీరౌ - కవిసమూహములలోనుత్తములైన, ద్విజన్మవరపద్మశరౌ - ద్విజన్మవరుడు పద్మశరుడుఅని, మిత్రే - మిత్రులు, అభూతాం - ఉండిరో, తేన - అటువంటి, అంబుజాక్ష - విష్ణుమూర్తియొక్క, చరణ - పాదములనెడు, అంబుజ - పద్మములకు. షట్పదేన - తుమ్మెదయైన, కులశేఖరేణ - కులశేఖరుడను, రాజ్ఞా - రాజుచేత, ఇయంకృతిః - ఈకృతి, కృతా - చేయబడినది.

గీ॥ ఎవనిమిత్రులు శ్రుతిధర ♦ కవివరేణ్యు
లరయగ ద్విజన్మ వరపద్మ ♦ శరులొ యట్టి
సారసాక్షునిపదపద్మ ♦ షట్పదుండు
రాజకులశేఖరుడు కృతి ♦ రమణ జేసె॥

తా. పూర్వము మళయాళ దేశమున అనంతశయనమహారాజగు కులశేఖరమహారాజు సమస్తవిదులగు స్నేహితబృందసమేతముగ నున్నతరి భక్తిపారవశ్యమున నీ ముకుందమాలాస్తోత్రమును సంస్కృతమున రచించి మించిరి.

ఇది

శ్రీ బాలభారతీ వరప్రసాద లబ్ధకవితాధారేయ
చిలంకూరు శ్రీరామచంద్ర నామధేయ
ప్రణీత శ్రీముకుందమాలాస్తోత్ర
వ్యాఖ్యానము
సర్వము సంపూర్ణము. తత్సత్.
శ్రీకృష్ణార్పణమ్.
ఓం ఓం ఓం ఓం ఓం.